చు । నేనీచెంతజేరదననుచునీపై । భ్రాంతిగద్దయురామచంద్ర॥ రామా॥ ౨॥ అలనాడు ద్రౌపది । హాకృష్ణయనిపిలువ । వలువలొసగినరీతిగా । యిలనునిను నెరనమ్మియుంటిని । యిప్రుడు రాకున్నావదేలను । సలలితముగనన్ను బ్రోవను । నవుయమిదేళ్రీరామచంద్ర॥ రామా॥ ౩॥ అబ్ధియంబుధిలోను । మత్స్యావతారమై । ముచ్చుసోమకునీప్పుడంచీ । ఇచ్చయుగాకత్తుసేసి । తెచ్చివేదవబ్రహ్మకిచ్చిన । పక్షివాహన నీదునామము । ఈక్షితిలోవర్ణింపతరమా । రామా॥ ౪॥ అవనిజామదనయగ్గరామస్వామిగురుని । ఆశ్రయించినందుకు । నవనితంత్రైనబ్రోవగనలో । శ్రవణానందకరములందమాకు । భువనరక్షక నీదునామము । మనమునను నమ్మియుంచమనిరి॥ రామా॥ ౫॥ భాసురముగ బూస । అప్పాలదాసుని । శాశ్వతరీతి నేమి । దాసదాసులలోనునేనొక । దాసుడనయ్య నెపెడితిని । మోహనమూర్తీ విదిగాన । జాలిబూని బ్రోవవె రామచంద్ర॥ రామా రామ రామ॥

క॥ దేవాసీవాడనుసుమి । శ్రీనరహరి నమ్మితి । భావజజనకా, నీనామామృతము । రావానా వెతలుదీర్ప । రమ్యముతోడన్॥

—* మోహనరాగం- ఆదితాళం *—

౪౧॥ కీర్తన॥ దేవానన్నుబ్రోవవేమిరా । యెంతోనగావకున్నానురా । దేవా నేనునీవాడగాళ్ళుకాని । భావమందునీ । భజనయొనర్చిన॥ దేవా॥ ౧॥ సదానిన్నుగొలచితినిరా । నీదయాదాయాము కరుగదేమిరా । ముదాముతో నీమధురనామము । అదే సేయని । సదా భజించితి॥ దేవా॥ ౨॥ నీపాదమేనమ్మితినిరా । నా ఆపదలెడబాపవేమిర । కోపముచేసతి శాపమునను పెద్ద । పాషాణమైన మాల్య । అపాదవీక్షిన॥ దేవా॥ ౩॥ చాలానిన్నుబాగడవింటిరా । నీపాలబడి బ్రతిమాలితిర । ఈలానన్ను యమకాలాకింకరుల । పాలుజేయ నీకు । మేలానీలవర్ణ॥ దేవా॥ ౪॥ మరీమరీ వేడితినిరా । నామొరాలింపకున్నావురా । కరుణతో బూసప్పాలదాసునీ । దరిజేర్చు శ్రీహరీనమ్మితిని॥ దేవానను॥

—* శిష్యుండగు. చుట్టూరి నారాయణదాసు. *—

కం॥ యిన్నివిధంబులవేడిన । కన్నులతో జూడవేమి కనకాంబరనీ । సన్నిధిని జేర్చు । నన్నుతిజేసితినియిప్పుడు జానకిరమణా॥

—* నాదనామక్రియ రాగము- ఆది తాళము *—

౪౨॥ కీర్తన॥ యెన్నివిధములను । వేడినగానీ । దయరాదయ్యయోరామా । నాఘోరపాపములు । బారదోల । నీదేభారము । రఘురామా॥ యెన్ని॥ ౧॥ రామ రామునీనామము । బాగడను ఎంతవాడ శ్రీరామ । కామజనక నీకోమలిరూపము । కన్నులజూపుమిరామ॥ యెన్ని॥ ౨॥ చాలుచాలునాపైనికత్తు । నీకేలనో యీ శ్రీరామ। నీరజాక్షునీపాదపద్మములు । నానమ్మితి శ్రీరామ॥ యెన్ని॥ ౩॥ తల్లిదండ్రిగురుదైవము నీవని కొల్లగనమ్మితిరామా । నల్లనయ్యానగుమోముజూపినను । చల్లగనేలుమిరామా॥ యెన్ని॥ ౪॥ ధారిమిలో శ్రీయడ్లరామ । సద్గురుకృపగల్గెనురామా । తారకమంత్రప్రభావముచే । నినుదలచుమనెను శ్రీరామా॥ యెన్ని॥ ౫॥ [illegible]వగమదనని మరిమరి వేడితి । అరుడెంచుము శ్రీరామ। ధరలోచిట్టూరి నారాయణ। దాసునిబ్రోవుము శ్రీరామా॥ యెన్ని॥

కం॥ నారాయణనే నమ్మితి । నేరములనుబారదోలు । నారదలోలా । కోరినవ రమిచ్చెదవని । పారాయణ జేయుచుంటి । పరమాత్మాహరీ॥

—* నాదనామక్రియ రాగము- ఆదితాళము *—

౪౩॥ కీర్తన॥ నారాయణనారాయణ యనుచును । కోరిభజించవె మనస । దారిద్ర్యములను । దూరముజేపె । నీరజాక్షుడే మనస॥ నారా॥ ౧॥ మర్మముదెలియక । మాయకులోబడి । కర్మనొందకే మనస । చర్మపుతిత్తిది । శాశ్వతమా । గురుధర్మమిదుకమనస॥ నారా॥ ౨॥ మతభేదంబులుమాని । సద్గురుని । హితవుగనమ్మవెమనస । గతియేశ్రియఃపతియనినతతము । మతిగలిగుండవెమనస॥ నారా॥ ౩॥ ధరలో యడ్లరామయాఖ్యగురు । చరణమునమ్మవెమనస । అరమరలేకను । కరుణజూచి । పరతెరవుజూపునేమనస॥ నారా॥ ౪॥ పెద్దలుదెల్పిన । సుద్దులువినుగాని । బుద్ధిగనుండవెమనస । ముద్దుగచిట్టూరి నారాయణ । దాసుని । బోధనువినుమనస॥ నారా॥

కం॥ గతిజూపేదారవని । నామదిలో సతతమును । సీతాపతియనియంటిని । సుతునిక్కలెజూచిఋప్పుడు । హితమతితో బ్రోవవయ్య । శ్రితజనపోష॥

—* నాదనామక్రియ రాగము- ఆదితాళము *—

౪౪॥ కీర్తన॥ యంతకేడినా చింత దీర్చవు । కాంతజనక శ్రీరామ । కాం

తమూర్తివని । భ్రాంతినొందితిని । పంతమేలగుణధామ॥ యంత॥ ౧॥ మందరగిరిధ
రసుందరవిగ్రహా । మదనజనక శ్రీరామా । పొందుగ నీపాదాబ్జములకు । నావందనము
య్యారామా॥ యంత॥ ౨॥ వెనక జేసినటువంటి నేరములు । యెంచకు శ్రీరఘురామా ।
కన్నసుతునివలెనన్ను బ్రోచి । నకుకన్నులజూడవె రామ॥ యంత॥ ౩॥ చిక్కుబంధము
లొబడద్రోయకనను । చక్కగజూడవె రామ । దిక్కునీవెయని మ్రొక్కుచునుంటిని
చక్కనయ్య శ్రీరామ॥ యంత॥ ౪॥ యిమ్మహిలోనను హింసలుసేయుట । సమ్మతే
న శ్రీరామ । నెమ్మదిలోనీనామముదలచితి । రమ్మనిబిలువవె రామ॥ యంత॥ ౫॥ క
రివరదుడనను కరుణజూడమని । శరణనివేడితి రాము । కరువుదీరగను వరములొసగి ।
నాశిరముననుండవె రామ॥ యంత॥ ౬॥ దండిగామ యీభూమండలమున । నిండిన శ్రీ
రఘురామ । నిండుగనాహృత్కమలమందు । గూర్చుండగదే శ్రీరామ॥ యంత॥ ౭॥
దశరధనందన దశవిధవేషా । దశముఖమర్దన రామ । దోషములనుకడద్రోచినన్ను ।
నీదాసునిజేయవె రామా॥ యంత॥ ౮॥ ధరయందున శ్రీయడ్లరామ గురువర్యుల కృపచే
రామ । పరిపరివిధముల ప్రార్థనజేసితి మరువక బ్రోవవె రామ॥ యంత॥ ౯॥ వాసిగా
ను శ్రీకాశినాదపుర । వాసబ్రోవుమా రామా । భాసురముగ చిట్టూరి నారాయణ ।
దాసునేలు జయరామా॥ యంతవేడిన॥

—* శిష్యుడు విత్తనాల కొండయ్యదాసు. *—

౪౦॥ పంతమటర శ్రీయక్షపతి । యంతని బ్రతిమాలుకుందు । యీమేతియామర । సం
తతముగ నిమనమిస్త్రితి । చెంతకునను చేరదీసి । దయ్యనబ్రోవు॥

—* బిళాహురిరాగం- ఆటతాళం *—

౪౫॥ కీర్తన॥ పంతామేలమనాపై । దంతిరక్షకధరలో । దాతవైదయజూడ
ర । పతితపావన నిన్నె బ్రతిమాలినా గతి జూపవేమి । సతతము మతియందున
మ్మితి వెతలుదీర్చవె హితముమీరగ॥ పంత॥ ౧॥ మాధవయని నిను నే ప్రార్థన
జేసిన । హృదయాముకరుగాదేర । వేదవేద్యుడ నన్నునీదరి జేర్చి ఆదాశం చెదపు య
ని । పాదయుగళములకును మ్రొక్కితి ముదముతో శ్రీరాఘవలోలా॥ పంత॥ ౨॥ కేశవ
బ్రోతువని । దోసిలొగ్గితి నన్ను మోసాముశాయకురా । శాశ్వతంబనినిన్నువేడితి ।

గాశిదీర్చియు శ్రీనివాస । వాసిగాళవ పాశములు తెగగోసివేయవె శేషశయన॥ పంత॥ ౩॥ సారసాక్షునివనే । కోరియుంటిని । నామొరాలకించవదేమిరా । నీరజాక్షుడనిన్నునమ్మితి నేరములు యెంచకురనాపై । దారవునీవని నమ్మినందుకు తెరవుజూపుము ఉరగశయన॥ పంత॥ ౪॥ నాపాలిదైవమని । నీపాలబడియుంటి । గోపాలగోపాలక । చపలచిత్తుని పాపములెన్నక కృపముగాకృపజూచివేగరా । అపరమితముగ వరములొసగి ఆపదలుకడతేర్చు శ్రీపతి॥ పంత॥ ౫॥ మండలాధీశ । నీఅండజేర్చియునన్ను । దండిగదయజూడరా । నిండుగా నాబంధతనములు పొందుగాఖండించెదవుయని । దండిగాయీపుడమిలో శ్రీయడ్లరామాహ్వయుడుదెల్పె॥ పంత॥ ౬॥ భక్తూనీతమని । విముక్తిజేసెదవాని । శక్తికొలదిదేవదేవ । భక్తితోవిత్తనాల కొండయ రక్తిగా మిమ్మదలచుచుండెను । ముక్తిజేరయుక్తిదెల్పి శక్తిపరచవెభక్తపాలా॥ పంతములను॥

కం॥ దశరథనందనయిపుడీ । వసుధలోదరిజేర్చవేమి । దశముఖహరణా । దశవిధములనుతియించిన । దయరాదేమయ్యనీకు । దానవహారీ॥

——* జంఝూటిరాగం- అటతాళం *——

౪౭॥ కీర్తన॥ దశరథనందన । దశముఖమర్దన । పశుపతివినుతనను । వసుధలోబ్రోవవేర॥ దశ॥ ౧॥ పరిపరివిధముల । శరణనిఅంటినను । అరమరలేకనీవు నామొరవినకున్నావెర॥ దశ॥ ౨॥ రాక్షససంహార । రక్షణకాయవెర । పక్షివాహన। నాదు । దీక్షయుదీర్చవెర॥ దశ॥ ౩॥ మదనగోపాలనీదు । హృదయమురరుగాదేమి। ననాలోలుడవని ప్రార్థనజేసితిని॥ దశ॥ ౪॥ కరిరాజపోషణ । దరిజూపవేమిర । కోరికలొసగినను । నీదరనుజేర్చవెర॥ దశ॥ ౫॥ తల్లివినీవెనా। తండ్రివినీవేయని । యుల్లములోననిన్ను చల్లగనమ్మితిని॥ దశ॥ ౬॥ ధరణిలోయడ్లరాము । శ్రీగురువులసన్నిధిజేరి । నీరజనాభనిన్ను । నేకోరితోచేటితి॥ దశ॥ ౭॥ చింతనుజేరాదీసి । చింతలుమాన్పవెర । వరతము విత్తనాల । కొండయదాసపాల॥ దశ॥

గీ॥ ఇతరకారణము । నీపొందుకోరితిని । రొంచుజూచిన ఇహమందు పెవరులేరు । ఇంతకాలమయ్యె నామొరయాలకించి । అందముగబ్రోవు అఖిలధ్యాంతరహిత॥

—* శుద్ధకాంభోజి రాగం - ఆదితాళం *—

౪౯॥ కీర్తన॥ ఇందురారగోవింద । నాహృన్మందిరంబునకు । పొందుగానీ పాదములకును । వందనంబంటినిగదర । సుందరాంగ । నందబాల॥ ఇందు॥ ౧॥ పన్నగముపైనున్నదిన్నికృష్ణ । విన్నవమిత్రతిరా । ఎన్నోవిధముల నన్నుతించిన । విన్నపంబాలించవేమి । కన్నతండ్రినన్నుబ్రోవ॥ ఇందు॥ ౨॥ నీరజాక్షనానేరములెంచక । దారిజూపరా । కూరిమితోనేను । కోరివేడితి । వేరూకాయ । మేరగాదు । రారానన్నింకేలుకోర॥ ఇందు॥ ౩॥ యంతనేనుతియించినా । కాసింతదయరాదా । సంతతంబున నిన్ననమ్మితి । శాంతూజనక । నీదాసూని । చెంతజేర్చుపంతమేల॥ ఇందు॥ ౪॥ రేయివేళను । వేసారితినినను । నీవెబ్రోతువనీ । దేవదేవగావుమనుచును । భావమందున । నిన్నునిను । సేవజేయుచుంటిగదరా॥ ఇందు॥ ౫॥ రారనేశరణంటినీ శ్రీరామచంద్రహరీ । ఘోరములకు । యాధారుశత్రుయుని । ధరణిలో శ్రీయద్దరామ । గురువరులెరిగించినందూకు॥ ఇందు॥ ౬॥ భాసురంబుగ దాశరధి । నాగాశదీర్చార । వాసిగానిత్తనాలకొండయ్యా । దాసూనీభవపాశములు । గోసివేయుశ్రీనివాస॥ ఇందురార॥

—* శిష్యుడు తిరువేంకటదాసు *—

౫౦॥ రారారఘువంశోత్తమ । రారా నాకోర్కెదీర్ప । రక్షించుటకురా । చేరిమీసన్నగణమురువక । నిరతముభజించుచుంటి । నీరజనాభా॥

—* హిందూస్తానీకాఫీ రాగం - ఆదితాళం *—

౫౧॥ కీర్తన॥ రామహరిరామసీత । రామాబ్రోవర । పరంధామవేగ । నామొరాలకించవేమిర॥ రామ॥ ౧॥ శాంతవపోషణ । సమనీఅండజేర్వర । పుండరీకాక్షుంతనాలో । నింతియుందర॥ రామ॥ ౨॥ పాతకుడను నాతోనీకు । పంతామేలరా । పొదంతివరదవేగను । నాచింతదీర్చర॥ రామ॥ ౩॥ మాధవగోవిందకృష్ణ । పాదములర । పొడూజానాడగన నాడు । బాధదీర్చర॥ రామ॥ ౪॥ పరమపురుషవరదసన్ముని । దరికిజేర్చర । అరమరసేయక నాను । కోర్కెదీర్చర॥ రామ॥ ౫॥ ధరణిలో శ్రీయద్దరామయాఖ్య । కరుణతో । మమునకన్మరియించితి । శ్రీమాధవబ్రోవు॥ రామ॥ ౬॥ వాసిగనభక్తతతుల । బ్రోచినదేవా । దోసిలొగ్గిన । తిరువేంకట । దాసునేలుమూ॥ రామ॥

గీ॥ నీలవర్ణనీదుపాలబడియుంటిని । నీశ్రేయుంచునన్నుపాలయుంచు । పాలనశాయర । బాలగోపాలనేచాల నమ్మియుంటి రాధలోలా॥

—* శుద్ధకాంభోజి రాగం- అటతాళం *—

౪౯॥ కీర్తన॥ పాలించరాభక్తపాలా । యీజాలామేలను । శ్రీవేణుగోపాలా॥ పాలిం॥ ౧॥ శ్రీరామయింటాకునాపై । నీరజనయనా । సరసజాత్రకులేంద్ర । నను యామీదేరా॥ పాలిం॥ ౨॥ కరినీగాచినరీతిగావార దేవ । కరుణించేగౌరవానీ సైర నమ్మినారా॥ పాలిం॥ ౩॥ పేదాకూచేలూని । పూవారఅటుకూలు । మీదామతో గొన్న । మాధావ రారా॥ పాలిం॥ ౪॥ మందరధనీదు । సుందరపదమూలు । పాంమాగమదినిల్పి । పూజించెదమురా॥ పాలిం॥ ౫॥ ఆశతోనిను వేడి । దోసిలొగ్గితిరా । మోసబుచ్చకు । జగన్మోహనాకార॥ పాలిం॥ ౬॥ రాతినాతిగజేసి । ఖ్యాతినొందిన సీతా । పతినీవేగతియాని । మదినమ్మినారా॥ పాలిం॥ ౭॥ ధరణిలోపలదుష్ట । వర రామాగురుమూర్తి । చోరాయులనునమ్మి । న్యరణజేసితిరా॥ పాలిం॥ ౮॥ వర మూగజేరు వేంకటదాసపోషా । సురులబ్రోచిన । పరమపురుషవీరా॥ పాలించరా॥

కం॥ రారానామొరవిని । కరుణించర కరుణాలలామ । తారకనామా । రారాప రాకుసేయక । రారావరమిచ్చుటకును । రారారామా॥

—* మాయామాళవ గౌళరాగం- ఆదితాళం *—

౫౦॥ కీర్తన॥ రారాశ్రీరమణా । నన్నుకరుణించు । రిపుహరణా । హరిహరి॥ రారా॥ ౧॥ పరమపూరూపునన్ను । నిరనమ్మియున్నాను । అరమరసేయాబోక । ఆదరించార శ్రీధార॥ రారా॥ ౨॥ పన్నగశయననాదు । విన్నపమూలుకించి । కన్నడ సేయకు । పిన్నానమున్నించాను॥ రారా॥ ౩॥ నీరాజనయననాదు । భారము నీదేగాదా । నేరముతెంచుట । మురగాసురహారి॥ రారా॥ ౪॥ దశరథనందన । దశముఖునంహార । శశిధరనుత నీకు । శరణంటినీవేగా॥ రారా॥ ౫॥ అపద్బాంధవనాదు పాపము లాపుదాతి । కోపాము సేయాక । శ్రీపాతివత్సలు॥ రారా॥ ౬॥ సంకటహరణనాదు । శంకలన్నియుదీర్చి । పొంకాముతోనాయుని । అంకమందునజేర్చు॥ రారా॥ ౭॥ బాలాము సేయానీకు । మేలుగాదు రామ । నీపాలబాడితినన్ను । మేలుశ్రీవేణుగోపాల॥

రారా॥ ౬॥ భాసురముగ యజ్ఞ రాకుదేశాకులాచే । దోసిల్లొగ్గితి । జగదీశా । నను బ్రోవ॥ రారా॥ ౭॥ ధరణిలోజీరు వేంకటదాసుని మొరవిని । విరవిరవరములొసంగుటాకు॥ రారా శ్రీరమణా॥

—* శిష్యుడు కంఠ అప్పలదాసు *—

కం॥ రారా రఘుకులచంద్రా । రారా క్షీరాబ్ధిశయన । రణజయహారా । కోరితినిను మది మురువక । నేరసుడను నన్ను బ్రోవు । నీరజనయనా॥

—* ముఖారిరాగము- అటతాళము *—

౫౧॥ కీర్తన॥ పరమపురుష వేగరార । నన్ను కరుణించ దయరాదా నీకు । సురసంరక్షణ నేరమేర । నన్నుదరిజేర్చకున్నావదేమి । శరణని నీమరుగు జొచ్చితి అరమరలుజూడకుమి వేగమె । వరములొసగవె కరుణగదీగ దొరవునీవనినమ్మి యుందును॥ పర॥ ౧॥ మునియాగమును గాచినావు । తాటకినిబట్టి దునిమాడినావు । వనపాలాసము జేసినావు । నన్నుబిడనాడివూరకున్నావు । అనయముగ నీపాదపద్మము । వినయమలరగ సన్నుతింతును । ఘనముగ రక్షించకుంటె దీనజనశత్రువుడ వందువు॥ పర॥ ౨॥ మత్స్యావతారమైనావు । కక్షజేసి శారధిజొచ్చినావు । ముచ్చసోమునిబట్టినావు । పొట్టచీరి వేదములుగొన్నావు । యీక్షణంబున నన్ను నీదయ జూచెదావని చాలనమ్మితినీచుడని విడనాడితే నను కాచిబ్రోచేవారు దెవరు । పర॥ ౩॥ మందాదన నిబల్కినాను । భక్తబృందాకృపజూడుమన్నాను । యెందూననినుగానకాను । హృదయమందువేనటబెంచినాను । వేదవేద్యుడనీదునామము మోదమొందుచు సర్వకాలము । పాడుకొని ధ్యానింతు నామై వాదమేలను రాఘవలోలా॥ పర॥ ౪॥ నిన్నుగానకనూయున్నావు । భువిలోయెన్నిజన్మములెత్తినానో । కన్నతండ్రివి నీవైనావు । నన్ను మన్నించవయ నేలుమికను । పన్నగాధిపశయన యికనినునమ్మితిని నాదైవమనుచును । కన్నడాసేయంగ తగదు విన్నపంబాలించు శ్రీహరి॥ పర॥ ౫॥ రాక్షసాంతక వేగరార । జగద్రక్షక । యికతాళలేరా । పక్షమువ్వరు లేరు రామ । నీవే పక్షమై రక్షించుమో ప్రియా । సూక్ష్మక్షేత్రవందిర నాకునీవై దీక్షబూటుమ మోసబుర్చకు । యీసమయమిలో శ్రీయద్దరామ స్వామిసద్గురుమూర్తి సాక్షిగ॥ పర॥ ౬॥ దోషములనుకడద్రోచి నన్ను । బ్రోచేదవని దీక్షజేసి । దానవోత్తమవిరుదుజూచి । భువిలో మాకు గాండ్లను యెడబాసి । వాసిగా రేద

దశు చేలుని బ్రూదర అటుకులు మోదముతోగని । ఆదరించి వాని బాధ మాన్పితివి దే
వా । ఏదయ్యాదయా నామీద । ముందేమి జేసితినో గాథా అందుకె దయజూడవు నా
థా । భూనాథా వాదా సాధులబ్రోవను రాథలోల వదపేవ జేసెదా॥ యింద॥ ౧॥
రామురామ శ్రీరామ । రంగగుణధామ । భూసురోద్ధామ । భక్తజనకామ । ఇనకు
లోద్ధామ । బ్రహ్మజనప్రియా । తారకానామా । దైత్యకులనామా । హతహతాస్థో
మా । వేదాంతవేద్య శ్రీరామా । భీమపరాక్రమ కామజనక మమ్మేలుమి సీతారా
మా । వాదిత్యవంశ శ్రీరామా । కమనీయగాత్ర రఘురామా । నమచిత్త సర్వగణ భా
మ । ఏమందును నాపూర్వఫలము మిమ్మేమని వేడిన నామొరవినవు శ్రీరమణహరీ॥ యిం
దు॥ ౨॥ అన్నన్నా నీకన్న దైవము ఎన్నలేము సుప్రసన్న మాధవ । కన్నతండ్రివని ఎన్ని
విధంబుల నిన్ను నమ్మితిని కన్నడశాయకు । మున్ను కరిని సేలొక్రన్న చందమున । కమల
జూడు రామన్న అన్నిటికిని ఆధారుడ నీవని । సన్నుతించితిని పిన్నవాడనాకన్నప మి
నవేమన్నా నిన్నెపుడు కందునోయన్నా నేనితరుల గొలుచుట సున్నా । నీనిజ రూపు
జూపగదవన్నా । మున్ను అనేకులగాచినరీతిని నన్నుబ్రోవు రామన్నా వేగమే॥ యిం
దు॥ ౩॥ కటకటమున యాకుటిలదానవుని హటము పేయబల్ పటపటన్తంభంతటకున
పగలగ చిటచిటమని మంటలు పొగలెగయుచు నిటలాక్షుడ నాల్దిశలు బెదరగ పటు
తరముగ హిరణ్యాకశపుని ఘుటఘుట రక్తంబులుగ్రోలిన హరి ఎటుజూచినలేదే తో
వా । ఇటురావయ్యా ననుబ్రోవా । నీమటుమాయలకును ఎటువలెతాళుదు తటమట
మేటికి తాటకిమర్ధన ఇటునామొరవిని గావా । కెటుబోగలవయయో దేవా । నాటి
దినామదికి పేవా । నాబోటిజనులబ్రోవావేసూటిగ సద్గుణ యద్దరామస్వామి నాటకథ
రసిహాటి దైవమెచ్చోటను లేదు యని చాటజూచి నీచాటు జొచ్చితి॥ యిందు॥ ౪॥
దానదాన తజ్ఞానదానులకు దాసుడనంటిని మోసముజేయకు వాసుదేవనీ న్నగణకు
విరతము గాసిజెంది బహుదోసిలొగ్గితిని వాసిగాను కేవలతాకేట పురవాసా । దశ
విధవేషా గణగుణభూషా భవదోషహరణ శ్రీకంటా అప్పలదావ హృదయ నివాసా
నారాయణలక్ష్మివిలాసా బసవేంద్రవినుత సుప్రకాశా అసురసురలవందరి సేలినహరి
వసుధలో నామర్ధకలు బావనా॥ యిందు రావయ్యా॥

—* కిమ్మ్యదు బోని అప్పలదాసు *—

కం॥ హరిహరియని ధరయందున । మురహరి మీస్మరణ జేతు గయడగమునక్రి । అరము
రలేటికి జేసెదు । సరగున రక్షించరావె సద్గుణపాలా॥

—* నాదనామక్రియ రాగము, ఆట తాళము *—

౫౪॥ కీర్తన॥ దేవుడా బ్రహ్మదేవుడ। మహానుభావ। దేవుడ బ్రహ్మదేవుడ॥ దేవుడ నీదివ్యపావన పాదములు భావమున నిల్పి కేవలము నీసేవ జేసితి సేవకుని కీలోకృపజూపుమి। దేవు॥ ౧॥ బట్టితీ నను బ్రోవమని వల పట్టితీ। బట్టితి నను బ్రోవమని వల పెట్టితీ। యీసృష్టిలోనను రట్టుపేయక దిట్టముగ చేపట్టి బ్రోవుము గట్టిగా నను। దేవు॥ ౨॥ కోరితీ రక్షించుమని కోసారితి। కోరితీ రక్షించుమని కోసారితీ। నాఘోరకర్మము బారద్రోలెదవనుచు నేనతిభక్తితో ప్రార్థించుచుంటిని। దేవు॥ ౩॥ కష్టమా నను బ్రోవ నీకిది కష్టమా। కష్టమా నను బ్రోవ నీకిది నష్టమా యీసృష్టియేలిన కృష్ణదేవుడవనుచు నమ్మితి యిష్టములు నెరవేర్చుదయతో॥ దేవు॥ ౪॥ వాదమా నేజేసినది యపరాధమా। వాదమా నేజేసినది యపరాధమా। యీబీదవిప్రుని మోదమలరగ ఆదరించితివేడ నీదయ లేదు నాపై॥ దేవు॥ ౫॥ వింటినీ సద్గురునివలనిను గంటినీ। వింటినీ సద్గురునివలనిను గంటినీ। యీమంటిపై నీజంటగోరిన బోని అప్పలదాసు నిప్పుడు కంటజూడుమి॥ దేవుడ।

కం॥ మందరగిరిధర నిను నే। పొందుగ నెరనమ్మియుంటి సుందరనాథా। ముందుగ నినుభజియించెద। అందముగా నన్ను బ్రోవు ఇందిరరమణా॥

—* మోహన రాగం, ఆట తాళము *—

౫౫। కీర్తన॥ యెందుబోయెదవింక రావయ్యా। శ్రీలక్ష్మీరమణా। పొందుగా నన్నేలుకోవయ్యా। యెందుబోయెదవింక రమ్మీ ఇందిరేశ ముకుంద సజ్జన బృందములాదిగ వందనంబులు ముందుజేసెద పొందుపరచుము॥ యెందు॥ ౧॥ బీదసాధులా ఆదరించిన యీదినీదయ లేదు మాధవా। మోదమలరగ బీదవిప్రుని ఆదరించిన రాధలోల నాగాధదీర్చను రాదలేదయ్యా। యీబీదవాని దరిద్రబాపను దారిలేదయ్యా। నీదారిదెలియక అభాగ్యుడనై నేబాధపడితినయా। యేదారిజూపక దేమి నేరము దెల్పవేమయ్యా। సాధుబోధవినోద యిదియొక గాథగాదు నన్నాదరించవు। మోదమలరగ నీదుపాదము లాదుకొంటిని బోధపర్చుమి॥ యెందు॥ ౨॥ అంచితముగ ప్రపంచమంత। సృజించినావని యెంచినామదినెంచుకొని భజియించెదను దయనెంచి పరవంచితములాసగుమి। కొంచపరచుట మంచగాదయ్యా। ప్రపంచమున నను వెంచకను తప్పించుకో

నకయ్య। పంచేంద్రియంబులు వంచకను చంచలుడనైతినయా। ఆపంచపాండవ సతి
ని బ్రోచినవాడవీవయ్యా। మంచివాడవనెంచినేను పొంచినేనీపంచగాస్తిని కొంచము
లోనరిబుచ్చకను నాకొంచబుద్ధులుద్రుంచుమవనిలో। యుండు॥ ౩॥ పక్షివాహన లక్ష్మీ
పతి యికకక్షయేలను విక్షుకునై। రక్షకాయని దీక్ష జేసితి పక్షపాతము సేయకను నీ
కుక్షినిదివీక్షించవేమయ్యా। నాపక్షమున నీలక్ష్యముంచిటు రావదేమయ్యా। లక్ష్మణుని
తోడుగా రాక్షసుల శిక్షించినావయ్యా। ఆపక్షిరాజుకు మోక్షమిచ్చిన ప్రభువు నీవయ్యా। అ
క్షయా కటాక్ష తక్షణమోక్షము నొసగుమి శిక్ష సేయక। యీక్షితిని రక్షణంబాయనురక్ష
కుడవయ లక్ష్మీనాయక॥ యుండు॥ ౪॥ పతితపావన సతతము నిను మతిని నమ్మితి హి
తవుమిరగ। ఇతరచింతలు మాన్పినను సమ్మతిని బ్రోవుము అతిత్వరితముగ। పాతకుల
లోపాతకుడనయ్యా। నాఘాతకీర్చను ఖ్యాతినీకే చెల్లునోయయ్యా। యీభూతలంబు
న పాతకుల బరిమార్చినావయ్యా। సీతమ్మకొరకై కోతిగుంపులఁగూర్చినావయ్యా। రా
తినాతిగజేసి ఖ్యాతిలో ఖ్యాతినొందిన సీతవల్లభ। ప్రీతితో మతియందు నడిచెద పాతకం
బులుద్రుంచి గావుమా॥ యుండు॥ ౫॥ ధరణిలో శ్రీయద్దరామా గురుకటాక్షము చే
తనేమి। మనుగునూరితి అరమరేలను కరుణజూచియు వరములొసగుమి। కరినిబ్రోచిన
దొరవు నీవయ్యా। కూర్మంబువై గిరినెత్తి సురులను గాచినావయ్యా। యీక్రూరకర్మ
ని పూర్వకృతములు ద్రుంచవేమయ్యా। నాకోరకున్న కోరికలు నెరవేర్చ రావయ్యా। న
రసురవరపురహారాదులు తరించిరి నీకరుణ స్థిరముగ। క్రూరకర్ముడ కుటిలుడను నినుత
రచ నాతరమా శ్రీహరి॥ యుండు॥ ౬॥ రాసిగరేచర్ల పేటనివాసుడగు శ్రీబోని అప్పల
దాసు నేలుమా। కేశవా నీకుదోసిలొగ్గుచు కాచియుంటిని। గాసి దీర్చను రావదేమ
య్యా। నేజేసినాకరుదోషముల్ కడద్రోసి బ్రోవుమయా। దశదిశల్ బ్రోచి వాసికె
క్కినవాడవీవయ్యా। నేజేసినా యీపాపములు వారించవేమయ్యా। దాన దోషని
వాశనావై కేశమాత్రము లేదు నీకృప। ఆశతో నెరనమ్మియుంటిని ఆశ్రయమున విశ్రాం
తినొసగుమి॥ యుండు॥

కం॥ పుడమీశుడవని నినునే। కడువేడుకతో దవలకు గడియ గడియకున్। మా
ధునినను కృపజూడుమి। పోతిమి గానీకు సేవ నిరతము దలతున్॥

యదుకులకాంభోజి రాగం- అట తాళము *—

౫౬॥ కీర్తన॥ గరుడవాహనవరంధామ। నన్నుకరుణించరా శ్రీరామా। న
రులబ్రోచెదారవునీవని స్మరణజేసెదవరముపురుష। కరుణదీరగవరములొసగి స్థిరము
గాపరతెరవుజూపుమా॥ గరు॥ ౧॥ పతితపావన సీతారమణా। యింతాపంతామేల
మదైత్యహరణా। అంతమూతెనిస్తి నాకదుచింతలన్నియుద్భవించుటకు। బలవంతుడావీ
వనుచు నేనతిభక్తితోబ్రతిమాలుచుంటిని॥ గరు॥ ౨॥ దాసపోషచిద్విలాసా। నాదోష
ములెంచకుమా విశ్వేశా। దశరూప పశుపతివినుత నినునేనాశ్రయించితివసుధలోపల।
విశదముగ పదిబాలుడను దుర్దశలుబాపుమి శేషశయన॥ గరు॥ ౩॥ కరుణదయాశాం
తస్వభావ। కరుణనిరుమారెడబాపుమా దేవ। పుడిబడిన నాచెడుగుణంబులుపుడమిలోక
ష్టజేసుటకు। నామొరయిడానిను గడియగడియకు పడి వెడదు కడువేడ్కతో హరి॥
గరు॥ ౪॥ పన్నగశయనా శ్రీరామా। నావిన్నపమిదుమా శ్రీరామా। కన్న తండ్రిని
విన్నపదములు సన్నుతించెద ఏన్నొవిధముల మిన్నకుండుట మేరగాదా పన్నగక్షక
సన్నుతాంగుడ॥ గరు॥ ౫॥ తాపసావరగుణారామా। ఓ ఆపద్బాంధవ రఘురామా।
కేపతేవము నేను యిలతాపములుబడిసేనోపజాలను బ్రాపుగోరిన దావుజేర్చుకు కోపము
అను పాపహరణా॥ గరు॥ ౬॥ దీనజనాధారసీవేరా। యాదీనునిమొర వినవేర। ఆ
మదివరము వనిబాని యడ్ల రామయాఖ్యుని కరుణజేమిము। వినుతిజేసినబోని అప్పలదా
సునీతుణముంతుబ్రోవుమి॥ గరుడవాహన॥

—* శిష్యుడు బోని గురయ్యదాసు *—

* కం॥ పావనమగు సీనామము। భావముననుదలచి వెఱదు పేదరయునర్తుక। దివి
జానుత నమబ్రోవుము। భవదోషవినాశ దైవరాయబావే॥

—* మోహన రాగం- అట తాళం *—

౫౭॥ కీర్తన॥ దేవదేవరావే। దివ్యప్రభావ బ్రోవరావే॥ దేవ॥ ౧॥ భావజజ
నక శ్రీపావనపదములు భావమందునిల్పి సేవజేసితి॥ దేవ॥ ౨॥ కష్టవేళనాపై రక్షణగా
యుండు నాపై। లక్ష్మీలక్ష్మణ సహితుడవై। యాపతిబావాణంకెక్కి రక్షించవు॥
దేవ॥ ౩॥ దారిద్ర్యనాశ రావే। కరివరదసేలరావే। దారిద్ర్యము పరిహారము జేయను।

శైవశిఖామణి దయతో గావను॥ దేవ॥ ౪॥ స్థిరముగా నుధరనూ। మద్గురువరుల కరుణ వలనూ । పరమపురుషునా దొరవని నమ్మితి అరమరశాయకు నరహరివేగ రావె॥ దేవ॥ ౫॥ గాసిదీర్చుమంటి। నీదాసుడను బ్రోవుమంటి । వాసిగ రేచర్ల పేటపురములో। కేశవదాని గురయ్య నేలుటకు॥ దేవదేవ రావే॥

కం॥ రామానమయము బ్రోవను । కాముని గన్నయ్య నీదు నామమహిమనే। సామజ వరద భజించిన । యేమాయెను నీకు ప్రేమ ఇనకులధీశా॥

—* యదుకుల కాంభోజి రాగం- అట తాళం *—

౫౮॥ కీర్తన॥ సమయోమురా రాఘవేంద్రా। ఇదియే సమయోము నన్ను బ్రోవ శ్రీరామచంద్రా॥ సమ॥ ౧॥ దాసులా బ్రోచిన కేశవానుమనే। నాశించి వేడితి మోసబుచ్చకురా॥ సమ॥ ౨॥ మందారగిరిధార నందా కుమారా। ఇందీర రమణ నాయందు పరాకా॥ సమ॥ ౩॥ మురిమారీ నీవే నా తెరవాయికొంటిని। మారుబల్కవదేర క్షీరాబ్ధిశయన॥ సమ॥ ౪॥ పతితావు నీవే నాగతియోని నమ్మితి। పెతదర్చవే సీతాపతి వన్నితిలో॥ సమ॥ ౫॥ పిన్నాడనటంచు ఎన్నోవిధంబుల। విన్నవించిన చేకొనకున్నావదేరా॥ సమ॥ ౬॥ పాపభారము చేత ఓపజాలకనేను। ప్రాపుగోరితి వేగకాపాడరాదా॥ సమ॥ ౭॥ ధరణిలోపల యడ్ల రామయాఖ్య గురువరుల కరుణచేత। స్మరియించినారా॥ సమ॥ ౮॥ వాసిమీరగ బోని గూరయ్యదాసుని। భాసురంబుగ బ్రోవ వాసిలో గ్గితిరా॥ సమయోము॥

కం॥ దశవిధవేష సురార్చిత । పసివాడను నన్ను బ్రోవు పశుపతినుత శ్రీ । దశరథ నందన వేగమె । వసుధలో దుర్జనబాధ వందనమంటిని॥

—* నాదనామక్రియ రాగము- ఆది తాళము *—

౫౯॥ కీర్తన॥ దశరథరాఘవ వసుపతిమత వాపశంధవేష శ్రీరామా। పసితనముచె జేసిన దుర్ణారలను వసుధలో బాపవె రామా। దశ॥ ౧॥ రామరామ ఓ కామజనక నీనామము నమ్మితి రామా। ఓకోదులాంగనా కామరత్వములు భూమిలో త్రుంచవె రామా॥ దశ॥ ౨॥ పావహరణ గోపాలస్వామి నీ ప్రాపుగోరితిని రామా। అళు కాయ

—* హిందుస్థాని కాఫి రాగం- ఆది తాళం *—

౬౧॥ కీర్తన॥ నారాయణ నీనామము నిరతము కోరి భజింపుచుంటినీ । శ్రీరామరామ కోరిభజింపుచుంటినీ॥ నారా॥ ౧॥ సారాములేని సంసారసాగరమున దరిగానకయుంటినీ । నాపైకృపజూచి దారిజూపక యుంటివి॥ నారా॥ ౨॥ క్రూరాగుణంబులుజేరకుండగా బారాదోలి రక్షించుచుంటినీ । శ్రీరామ బారదోలి రక్షించుచుంటినీ॥ నారా॥ ౩॥ తప్పులెన్నకనన్ను వప్పుగా కృపజూడమాయప్పా వేవేగరాగాదే। వప్పులతుప్పా అప్పా వేవేగరాగాదే॥ నారా॥ ౪। పలుమారునిన్నునే బ్రతిమాలి వేడిన చుల్కానజేయకుమీ । శ్రీరామరామ చుల్కానజేయకుమీ॥ నారా॥౫॥ రూఢిగ యడ్లరామస్వామి । సద్గురుకరుణాచే సేమానిసేవాగంటినీ । శ్రీరామ రామా । సేమానిసేవాగంటినీ ॥ నారా ॥ ౬ ॥ ధరణిలో మామిడి । అప్పాలదాసాని । కరుణాజూచి బ్రోవుమి । శ్రీరామరామా । కరుణాజూచి బ్రోవుమీ ॥ నారా ॥ ౭ ॥

కం॥ నారదప్రహ్లాదమునుల । హారిమిలో బ్రోచినట్టి । ధీరతపని నే । సారెకు నీ నామంబును । కోరితిదా జేర్పరావె । ధరసుర పోషా ॥

—* యెదుకల కాంభోజి రాగము-అటతాళం *—

౬౨॥ కీర్తన ॥ కోరితి రమ్మిక శ్రీరామా । నానేరాము లెన్నక । బ్రోవు రఘురామా ॥ కోరి ॥ ౧॥ సాధూలంబోచిన । అవివేకుడవాని । మోదాముతోనిన్నే । అమానాన్నారా ॥ కోరి ॥ ౨ ॥ సనకాసనందా మునీంద్రాది సేవితా । ఘనముగ నన్ను నివరిజేర్చకోరా ।।కోరి ॥౩ ॥ ఎంతో వేడిన । కాసింతైనా దయరాదు । దంతివరద నాతో । ఎంతామేలనురా ॥ కోరి ॥ ౪ ॥ స్థిరముగ నివేశా । ధారవానీ నక్ష్యంతి । అరమార కాయాకు । వరభక్తపాలా ॥ కోరి ॥ ౫ ॥ ధరను సద్గురుమూర్తి । యడ్లరామయాఖ్య । కరుణాంత నీమగుగుహాలినీ ॥ కోరి ॥ ౬ ॥ వసుధాలో మామిడి । అప్పాలదాసాని । విశదాముగ నుబ్రోవు । దశవిధవేషా ॥ కోరితి ॥ ౭ ॥

—* శిష్యుడు, కంచుమర్తి యల్లయ్యదాసు *—

కం॥ అనుదినమును గురుపాదము । లనువదలక వేడినంత నానాభయముల్ । పోనులిమివైచి శ్రీహరి । ధ్యానముగనవచ్చు నిత్య ఆనందమునకా ॥

—* యదుకుల కాంభోజి రాగము ఆదితాళం. *—

౬౩ ॥ కీర్తన ॥ ఆనందముగా వినరయ్యా । మీ ఆత్మలో ముక్తి నిగనరయ్యా ॥ ఘనముగ సద్గురు పదములు మనమున । వినయమలర ప్రార్థించరయా ॥ ఆనం ॥౧॥ కుటిలమనుజులతో గూడి మీరు । కటుమాయలోబడి చెడిపోకరయా । పటుతరముగ శ్రీరాముని దలచుచు । కుటిలగుణంబులు విడువరయా ॥ ఆనం ॥ ౨ ॥ సాధుసజ్జనుల సహవాసముచే । సద్గతిమార్గము గనరయ్యా । వాదభేదములు మాని శ్రీహరిని మదినిపై ధ్యానించరయా ॥ ఆనం ॥ ౩ ॥ ధారుణిలో శ్రీయల్లరామగురు । కరుణగోరి మనకేలనయా । స్థిరముగా మదివైకుంఠపురమునకు । తెరవుజూపు నిదిగనరయ్యా ॥ ఆనం ॥ ౪ ॥ వాసిగా మనకంచుమలి యల్లయ । దాసపోషకుని గనరయ్యా । నీచగుణంబుల విడచి శ్రీహరిని । ఆశతో మదినుతియించరయా ॥ ఆనందము ॥ ౫ ॥

కం॥ పెక్కువిధంబులనిటు । నేమక్కువతో వేడుచుంటి । మరువక సరతంత్రగుక్కున ననుకృపజూడను । మ్రొక్కితిమీచరణములకు అక్కరతోడన్ ॥

—* నాదనామక్రియరాగము-అటతాళం. *—

౬౪ ॥ కీర్తన ॥ చక్కనివాడావయ్య । శ్రీరామయ్యా । నాదిక్కుజూడగ రావయ్యా । మక్కువతో నీదు । చక్కనీ పదములు । మ్రొక్కివేడెద రావయ్యా । శ్రీరామయ్యా ॥ చక్క ॥ ౧ ॥ ఎంతో నే వేడితినయ్యా । శ్రీరామయ్యా । నాదింతా వాపగ రావయ్యా । పంతామాతో నిన్నే । అంతరంగామున నా । మతించు రావయ్యా శ్రీ । దంతిరక్షక బ్రోవను ॥ చక్క ॥ ౨ ॥ కోరి వేడితినయ్యా । శ్రీరామయ్యా । దూరానాదాకుమయ్యా । సారామైనట్టి నీదు । తారకనామము । కోరి భజించెదనయ్యా । కోర్కెదీర్చవేగ ॥ చక్క ॥ ౩ ॥ చలము సాయాకుమయ్యా శ్రీరామయ్యా । ఇలలోన నన్నేల రావయ్యా । అలచాటదీర్చ నీవు । కలికావతార వేగ । దిక్కుపలుకూలునాతో । పక్కనికేల రామా ॥ చక్క ॥ ౪ ॥ దరిజేర్చ రావా దేమయ్యా । శ్రీరామయ్యా । నామొరవిన కరుణరాదయ్యా । ధరనూ యల్ల రామయాఖ్యుని కృపచే వేడితి । స్థిరముగా కంచుమాలి । యల్లయ్యదాసు నేను ॥ చక్కని ॥ ౫ ॥



—* శ్రీగురుపరబ్రహ్మణేనమః *—

# సుజ్ఞానచంద్రిక తృతీయభాగము.



గీ॥ కాయము స్థిరమని నమ్మియు । మాయను యెడబాయలేక । మగ్నంబగుచున్ । తోయజనేత్రుని దలచక । పోయిరి యమరూపులనకు । మాయలు చెల్లన్ ॥

—* నాటనామక్రియ రాగము ఆదితాళము *—

౨౦॥ తత్త్వము॥ స్థిరముగాదు యీమానవదేహము । పరమాత్మని స్మరించం పగదే । ధరలో నేయరమరలేకను । సద్గురుచరణము సేవనము సేదే । మనసనా మొర వినవె । ఇదినిపుగనవె । శ్రీహరియనవె నిరతము॥ స్థిర॥ ౧॥ కోటి సంపత్తుచు లనుభవించి । యీదారుపు పెరిగితె ఘనమటవె । మాసిపోను యీధరణిలోను । శ్రీరాముని మది విడబాయకువె॥ స్థిర॥ ౨॥ ధరణిలోను ధనధాన్యసంపదలు । గలిగినరాయుని మరువకువె । వరమభాగవతులైన మహాత్ములు । దానశౌరి భజియించారె॥ స్థిర॥ ౩॥ వేడుకతో శ్రీరామకీర్తనలు పాడుచు ఆనందించగదె । దండధరుడుమన కన్నుల బడితె । ఖండించెనీ వజ్రాయుధమే॥ స్థిర॥ ౪॥ గాలిసముదిని కీలుతెలిసి । యీలమూడుగుణములను । గూల్చగదే । మేలను యెనుబదినాలుగు లక్షల । యోనులబుట్టుటకు లటవే॥ స్థిర॥ ౫॥ నారాయణ చతురాక్షరినిరతము । పారాయణయని పాడగదే । ధారుణిమంతిన వేంకటార్య సద్గురుని పాదము మరువకువె॥ స్థిర॥ ౬॥ నవ్వుతుల సాంగత్యము చే । వరసాధనమేదో చూడగదే । మేదినిపై శ్రీయడ్లరామదాసుని । వాక్యము వరసాధనమే॥ స్థిరము కాదు॥

గీ॥ కాయము శుచిలేని నియమంబులెందుకు । ఘటము శుచిలేని మడిసములేల । మనసునిల్పకున్న మంత్రపఠనేటికి । ధరను యడ్లరామ దాసపోష॥

—* మాయామాళవిగౌళ రాగము- ఆదితాళము *—

౨౧॥ తత్త్వము॥ ఈనరజన్మం బెత్తినందుకు । ఇహపరమును సాధించవలెగా । మానక సద్గురు నామము నిరతము । ధ్యానము చేసది యూనవలెగా॥ ఈన॥ ౧॥ వాదభేదములుమానియు సద్గురు । పాదముపై భ్రమచెందవలెగా । నాదబిందుకళ పాదుకొ

చేరెడుకన్నుల చూడవలెగా । జోడుగూడి యడబాయక నిరతము । గాఢమైనరతిగూడవలెగా॥ ఈన॥ ౩॥ యెక్కువైన యెనిమిది గజముల । నొకకుక్కచేత గరిపించవలెగా । ముఖ్యముగాయీమూడుమెకములకు । చిక్కనివృక్షము నెక్కవలెగా॥ ఈన॥ ౪॥ అన్నిమతంబుల చిన్నెలుదెలసి । యున్నతమైన మతమెరుగవలెగా । చెన్నుమీరగను పున్నపువెన్నెల । కన్నులమధ్యను గానవలెగా॥ ఈన॥ ౫॥ ధరలో శ్రీమంతిన వేంకటు । మద్గురువను మర్మము నెరుగవలెగా । అరమరలేకను జననమరణముల । యెరుగనిసోహము మరువవలెగా॥ ఈన॥ ౬॥ జడముగడచి కుడియెడమ్ములనడుమను । చెడుగుడిగుడియసి నుడువవలెగా । తడబడకను శ్రీయడ్లరామదాసుడు । దృఢమున సుడిగరువవలెగా। ఈనరజన్మంబెత్తినందుకు॥

గీ॥ నీవునేననుమను నేనునీవనుచు । నిక్కమెఱింగినవాడు నిజగురుండు । అట్టితత్వమెరిగి ఐక్యంబునొందుడు । ధరనుయడ్లరామదాసపోష॥

—* శంకరాభరణ రాగము- ఆదితాళము *—

౭౨॥ తత్వము॥ యెందుకేసందేహము । మానాన । నీకేందుకెసందేహము । యెందుకెసందేహ । మానందగూరునిపాదారవిందాధ్యాన్నముద్ర । పొందుగాగనొందీనపిదప॥ యెందు॥ ౧॥ సింధువేదాకాశతో । యాపుంటారిగొక్షుని । అందానుజేరిసాదా । నందయోగమభ్యసించి॥ యెందు॥ ౨॥ ఘటపటామాలయందూ । వటబీజమాత్రమైయున్న । పటుతరమాగబానిపాదసేవజేయుచును॥ యెందు॥ ౩॥ ధరలోమంతినవేంక । టార్యాంకరుణాచే । పరమయోగస్థుడైయున్న । వదపికనుగొన్నకిడిపట । యెందు॥ ౪॥ వాసికియడ్లరామా । దాసమానసంయుల్లాసు । కేశవబ్రోవుమారి । దోసిలొగ్గియున్నప్పుడు॥ యెందుకెసందేహము॥

గీ॥ తామరజలముచే దడియకుండినయట్లు । నట్లనెపరిపూర్ణ మమరియుండు । జ్ఞానవిజ్ఞానసుజ్ఞాను లట్లుందురు । ధరనుయడ్లరామదాసపోష॥

—* మాయామాళవగౌళ రాగము- అటతాళము *—

౭౩॥ తత్వము॥ తెలసితేపరిపూర్ణభావము । అలనమిమియులేనిది । మూర్ఖలకలుషములు । ఖండింపనస్తురు । కారణంబైయున్నది॥ తెలి॥ ౧॥ ధరలోకినవద్వారపుర । సహస్రారవీధినియున్నది । గు[illegible] చేయవశిలేదన్నది॥ తెలి॥ ౨॥ ముందుజాచిన బిందుసృష్టికి । ముందుతానైయున్నది । యానందదెలసిన ము

క । యీజగమంత ప్రచురంబైనది । అంతటంతటనసేల తనుతన । ఆత్మలోపలయున్న ది॥ కాంతి॥ ౨॥ నదులు క్షేత్రములెన్నిదిరిగిన । నదులకదిగోచరగానిది । కుమరుగ బ్రహ్మరంధ్రపురమున । కుండలాగ్రమునున్నది॥ కాంతి॥ ౩॥ చరాచరములుగానిది । అక్షరము తానైయున్నది । పరమసద్గురుపాదతీర్థ । ప్రసాదమున వశమౌనది॥ కాంతి॥ ౪॥ మాటలకు గనవడనది । తనమనసులో దృఢమైనది । వాటముగ గురు మాటదెలిసితె। బాటకులభముమైనది॥ కాంతి॥ ౫॥ ఆడదిమగవాడుగాకను । యేడజూచినయున్నది। రూఢిగగనుగొన్నవారికి। చూడచోద్యంబైనది। కాంతి॥ ౬॥ ముద్రలైదును జూచుటకు చిద్వ్యాప్తతారకమైనది । నిద్రవలె మరుపైనయోగము । నిర్వికల్పసమాధి॥ కాంతి ॥౭ అరమరలుమరిలేనిది । హంసోహరూపకమైనది । యీధరనుమంతెన వెంకటప్పవ । వలచిప్రాణవము అయినది॥ కాంతి॥ ౮॥ ఆటబాటకమైన కలియుగ । నాటకముగనుగొన్నది । మాటగను శ్రీయడ్లరామ । దాసుకెరుకైయున్నది॥ కాంతితిమిరముగానిది।

గీ॥ కంటకింపైనట్టి కెంపుమొక్కటిచాలు । పెంపు జేసెనశిలలు గంపెడేల । పరము దెల్పుచున్న । పద్యమొక్కటిచాలు ధరనుయడ్లరామ దాసపోష॥

—* మోహన రాగము ఆటతాళము *—

౭౬॥ తత్వము॥ గనుగొనలేమి బ్రహ్మయుబార బ్రహ్మం । బనుదినమునను । కనుగొనలేమి । యేఅనుమానమునులేక । వినయమింరగ । శ్రీసద్గురువరులనుగూడి॥ కను॥ ౧॥ కరువుదీరగను । గురువరునిమంత్రము। మరువకెప్పుడును। చిరచిరనుధరయందు । తాయపురమునకు । నరుడెంచిరాగులు । చరాచరములుగాని । యేకాక్షరముగని । సుస్థిరమునొందిరి॥ గను॥ ౨॥ కల్లగాద్వినుడీ । యుల్లమునకళుని । యునికిగనుగొనుడీ । తల్లనేనికజన్మమని । యీనల్లతామరపద్మములపై । పిల్లవానికిదెల్పి । యవ్వలపల్లవాధరి । మైక్యమొందుట॥ గను॥ ౩॥ కరుకురాళ్ళకును । పెరచెడిమనసును । కొరతనేయకనెను । స్థిరతరంబుగనీకుసిపే । కరుణనై బ్రహ్మాండమంతయు । గురుతుగసాధించికడకుట । మరువులేనటువంటిచిత్కళ॥ గను॥ ౪॥ యింతైనఘనులే మంతెనవేంకటార్య సద్గురులు । చింతనీకేల నేటికని । నావంతలన్నియు । మాన్పినద్గురు । మంతరము చేసిను । నేవనియింతునని । నమశాంతపరచెను॥ గను॥ ౫॥ రూఢిగవినుడీ । బ్రహ్మముమీలో బాడిగనుగొనుడి । వెడలియరమరులేనిగురువుల । నతిగియనుభవ । మైనతత్వము । ఫుడమిలో శ్రీయడ్లరామ । దాసుడిది ప్రకటించెభువిలో॥ గను॥

సీ॥ బాధగురువుజేయు । బోధలన్నియునగాధ । మధ్యగురువుజెప్పి । బుద్ధిదెలుపు సద్గురుండుగల్గి । దుర్గుణంబులుబాపు । ధరనుయడ్లరామ దాసపోష॥

——* మాయామాళవగౌళ రాగము- అటతాళము *——

౭౭॥ తత్వము॥ హరిహరిహరి । హరియనుమ । సద్గురువరుమంత్రము మరువకుమా । దశవిధనాదములనువినుమ । పరదేశులతో వాదాడకుమ॥ శ్రీహరి॥ ౧॥ మూడుమూళ్ళపాతునైన కోటలో । ముక్తికాంతస్నేహముగూడి । పేదుకలర తనవీణమీటుచును । పాడటిప చాక్షరివినుమ॥ శ్రీహరి॥ ౨॥ ఖేచరిముద్రాభ్యాసుడవై । హరిదాసదాసులకు దాసుడవై । నీచులస్నేహము । రోసిపరాత్పర । కాచినగోపుముని । యోగముచేయుచు॥ హరి॥ ౩॥ మూలదుబెత్తెడు శల్యమువిత్యము । మూలతిచిత్కాళ నిల్పగనును । ఆరుపుట్లలను చుట్టినపామును । మూరతించెనేర్పిదిగనుమ । శ్రీహరి॥ ౪॥ షోడశభావమునూర్దేరగ । ఈపదుగవాక్షుల మేడలపై । యోగాత్మరి మంత్రాభ్యాసుడవై । యీలోకమంత శాసేతాననీ॥ శ్రీహరి॥ ౫॥ యిరువైయొక । వెయ్యారువందలు । యిందు ప్రమాణము శోధించి । ధరలోమంతిన వేంకటార్య । సద్గురువరు పాదములకు వకుము॥ శ్రీహరి॥ ౬॥ నప్తకుల పాంచ త్యముచే । పరతత్వమిదా । పరిశోధించి । శబ్దరహితమును । బోధించు శ్రీయడ్లరామదాసుని బోధయిదిను॥ హరిహరిహరిహరి॥

గీ॥ అన్నవస్త్రములేక । హీనజెందెడివాడు । పరభావములతగోర భ్రష్టుడగును । భ్రమసిపట్టెడము । కేతకికుసుమములు జనిపట్లు । ధరనుయడ్లరామ దాసపోష॥

——* పాదనామక్రియ రాగము- అటతాళము *——

౭౮॥ తత్వము॥ రామరఘుకులసోమ । నామొర ఆలకించవదేమిర । పామరుండను మిగులపాపిని । ద్రోహినైచెడిపోతిర । ఆత్మారాముడు॥ ౧॥ చాలగనీనామమంత్రము । గోప్యముచుంటిమేమిర । అలికిల్లను యమునికియురిలో । కాలుజిక్కడిపోయిర॥ ఆత్మా॥ ౨॥ దేహగేహములుగా భ్రమసి । మాయలోబడియుంటిర । సహాయమువ్వరు లేరు । దీనికుపాయమదోదెల్పర॥ ఆత్మా॥ ౩॥ క్ష్యారతనయుడు విడచినను సే । చేరవలెననుకుంటిర । ఆరుగురుశత్రువులు తలచుక । వారిజాగ్రమునుందెర॥ ఆత్మా॥ ౪॥ మాయసుఖములు శాశ్వతంబని । వాడితినిగా స్వామిర । రూఢిదెలియగ మాయలశలు బాసిదేహాలాడెర॥ ఆత్మా॥ ౫॥ పంచేంద్రియంబులు । వంచలేకను । చంచలంబై యుంటిర । మంచితనమున నీదనే । సాధించనేర్చిరిగింతర॥ ఆత్మా॥ ౬॥ సంతకూట

ముక్తాభిధయనిక | చింతనొందుచునుంటిర | యింతలోమంతిన వేంకట | హితగురు
ముఖ్యులగల్గెర॥ ఆత్మా॥ ౩॥ వన్నెమీరగ కొమరగిరిలో | మన్నశ్రీజగధీశ్వర | యెన్నతక్క
ముగానిబ్రెమ్మను | తిన్నగకనుగొంటిర॥ ఆత్మా॥ ౪॥ చెడ్డతనమునువిడచియోగుల | బి
ద్దనైయున్నానర | యడ్లరామాదాసహృదయ | నివాసనినుగనుగొంటిర॥ ఆత్మారామ॥

గీ॥ చల్లలోనువెన్న నమరవనైనట్లు | కాయమందు పరము | నిమిడియుండె | చల్ల
దరచినట్లు | ఉల్లంబుదరచితే | ధరనుయడ్లరామ దాసపోష॥

—* మాయామాళవిగౌళ రాగము- అటతాళము *—

౭౯॥ తత్త్వము॥ వ్యవసాయముజేసెవారము| యీఅవనిలోపలకాపువారము|
వనజాక్షపూరము వీధివారము | నవనీతచోరుని భక్తవరులము॥ వ్యవ॥ ౧॥ అండపిం
డబ్రహ్మాండము | మేముమెండుగ నంతించినారము | పుండరీకాక్షునినామము |
యీపుడమిఅంతట జల్లినారము॥ వ్యవ॥ ౨॥ మిక్కిలీ కష్టించినారము | బీదుగ్ర
మ్మ్యానపండించినారము | ముమ్మ్యాతోకోసినారము | చక్కనికుప్పలు వెట్టినార
ము॥ వ్యవ॥ ౩॥ ఘనముగాపండించినారము | అనుదినము మాకెదియెహారము | ప
ఱిబూనిఇటువంటి ధనమాను | భక్తవరుల పాలుజేసినారము॥ వ్యవ॥ ౪॥ క్ష్మారజ
నముల పొందుగోరము | పరదారధనముమజూచి భ్రమయము॥ | పరులుయేమన్న యి
టుపైనివెరువాము | యీధరలోనద్గురుబోధమువామ॥వ్యవ॥ ౫॥ చింతలచే(ప్రొద్దుబు
చ్చము | పరమశాంతముని మదినుంచేవారము | వంతలేకమంతిన వేంకటార్యుల |
చెంతజేరినట్టివారము॥ వ్యవ॥ ౬॥ సూటిగనద్గురునికూటము | జిహ్వాపీఠంబుపై నిల్చే
వారము | త్రికూటమునహంసోహభావము | యడ్లరామదాసుని మోక్షయోగము॥ వ్యవ|

గీ॥ గుణహీనునకు పరమగోప్యంబుదెల్పిన | దెల్పినపుడు నోరుదెరచియుండు॥
కొల్పరిచెట్టుపై | కోతిమూర్చున్నట్టు | ధరనుయడ్లరామ దాసపోష॥

—* భూపాళ రాగము- అటతాళము *—

౮౦॥ తత్త్వము॥ మేలుకొలుపు॥ జీవుడా మేలుకొనవే | మేలుకొనవె వెర్రిజీవ
మ | బాలునికిలలోనుసౌఖ్యము | జాలమేలనుజేసెదవు | గురుకీలుదెలియగదే | జీవ
మా మేలుకొనవే॥ ౧॥ తల్లియవరో తండ్రియవరో | తానుయవరో తెలియలేకను | న
ర్మ్యమురణి యుండనేలను | యెల్లకాలమున॥ జీవ॥ ౨॥ రక్తమాంసపుతిత్తిలోపల | కా
మవైరిగూర్చుండెనలను | కత్తినూరుచు నుండెకాలుడు | మత్తుమరువగదే॥ జీవ॥ ౩॥

శిష్యవరములు మైనిచక్కని । తోళ్ళుగప్పిన వానిగాంచక । వ్రేళ్ళతో జపమాలద్రిప్పితే । మాలమున్నవటే॥ జీవ॥ ౪॥ మనసనే కాకమధ్యవర్తి । మాయలోబడద్రోయదలచెను । వినసహించదు యంతమాత్రము । యిద్ధపద్ధతిని॥ జీవ॥ ౫॥ క్రూరబుద్ధిదలంచివరము మ । దారిదెలియక నేకజీవులు । నరకకూపమునందు జారబడి । సదియాగానగదే॥ జీవ॥ ౬॥ వచ్చిపోయేవార్ని జూచి । మచ్ఛగుణములు విడచియీవ్వడు । నిశ్చయంబుగ । అచ్యుతుని నీమత్క్రి నదుకానకే॥ జీవ॥ ౭॥ ధరనుమంతిన వేంకటార్యుల । దాసునైకృపనొంది నందుకు । పరమపదవిని జెంది । ప్రకృతిని పరిహరింపగదే॥ జీవ॥ ౮॥ వివరముగ పరబ్రహ్మభావము । యిలమనుష్యులకలవిగాదు । యవనిలో శ్రీయడ్లరామ । దాసహృదయమున॥ జీవమా మేలుకొనవే॥

సీ॥ వితులనైజగుణము లెటులమాన్పగవచ్చు । యేటివంకదీర్ప నెవరితరము । కఠినమైనభార్య యిటువలెనటియించు । ధరనుయడ్లరామ దాసపోష॥

—* నాదనామక్రియ రాగము- ఏకతాళము *—

ప॥ తత్వము॥ అనుమానమెందుకే మనస । యీతనువు నిత్యముగాదు హంస । విషయములరగ గురుని । మనమునను బూజించి । గనుగొనుము అనుదినము । పరిబ్రహ్మమును॥ అను॥ ౧॥ సందేహమెందుకే మనస । బ్రహ్మపదవి గనుగొను పరమహంస । పొందుగ గురువరుని । మందిరంబున కేగి । యందు గురుపాదార । విందములకు నమ్రిక్కి । ఆనందయోగము । నొందినేర్పెటివలెను॥ అను॥ ౨॥ మేలుగా నీలోను మనస । వున్నమూలము నుగను పరమహంస । అలిపిల్లలు జూచి । చాలభ్రమ జెందెదవు । కాలకింకరులనుచు । గేలిజేసెరిబుధులు । కీలుదెలిసి నపిదప । చాలసుఖమున్నదట॥ అను॥ ౩॥ మాటలన్నియు వెఱ్ఱిమనస । పొట్టకూటికేనె పరమహంస । నోటికైనను వట్టి బూటకంబులు మాని । సూటిగ తనదు మెలిగ । మాటమును కేటించి । పాటుపై పట్టి త్రికూటమందు నజేర । పాటుబడితేమంచి । పరమార్థమున్నదట॥ అను॥ ౪॥ యిప్పుడేగనుగొనవె మనస । ముందుతిప్పలున్నవి పరమహంస । చెప్పితిని నావల్ల తప్పేమియు లేదు । ఒప్పుగమంతిన । వేంకటప్పను జేరి । ముప్పుదప్పించుమని చెప్పుకొను మేలు॥ అను॥ ౫॥ మౌనబుచ్చుకుసుమ్మిమనస । యడ్లరామదాసుని పరమహంస । ధ్యానరంబుగమీహా । మోనగాండ్లము దాసి । ఖేచరీముద్ర । అధ్యానమునదేశమును । జూచినవారు । పరదాసులై యుండిరట॥ అను॥

